# ఆత్మషట్కము–1

## ( శ్రీ శంకరాచార్యులవారు)

శ్లో॥ నాహం దేహో నేన్ద్రియాణ్యన్తరఙ్గః
నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః
దారాపత్య క్షేత్రవిత్తాదిదూరః
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహమ్॥ 1

*తా॥ నేను శరీరమును కాను. నేత్రాది ఇంద్రియములను కాను. అంతఃకరణమును కాను. అహంకారమును కాను. పంచ ప్రాణములను కాను. బుద్ధియు కాను. భార్యాపుత్రక్షేత్రధనాదులను కాను. నేను సాక్షిని. నిత్యుడను. ప్రత్యగాత్మను. శివస్వరూపుడను.*

వ్యాఖ్య :—అజ్ఞానమే జీవుని సమస్త దుఃఖములకును కారణము. తాను కాని వస్తువును తానని భావించుటయే అజ్ఞానము. దేహము, ఇంద్రియములు, మనస్సు, దేహమునకు ఆవల నున్న క్షేత్రవిత్తాదులు, బంధువులు, సమస్త దృశ్యపదార్థములు జడస్వరూపములు. కావున అవి తాను కాదు. జడస్వరూపము తానెట్లు కాగలదు? తాను ఘటమెట్లు కాగలదు? ఘటమునకు సాక్షియగు చైతన్యమే తాను. దృశ్యకోటికి, క్షేత్రమునకు, జగన్నాటకమునకు సర్వసాక్షియే తాను. ఈ భావమే పై శ్లోకమునందు చక్కగ విశదీకరింపబడినది. కావున జీవుడు తాను చైతన్యమగు ఆత్మయనియు, జడ వస్తువు కాదనియు పదే పదే మననము చేయుచుండవలెను.



సంపుటము : 25 మే 1993 సంచిక 5

## సంపాదకవర్గము



సంవత్సర చందా : రూ. 30/-లు

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ-520 002
ఫోన్స్ : 61862, 64017, 72433
Telex 0475 362 ANIL Fax : 0866-63017

శాశ్వత చందా : రూ. 300/-లు.

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి-517 640
ఫోన్స్: 2239,2543 STD Code 085 78

**చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.**

# అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక





విఘ్నములను తొలగించే వినాయకుడవు నీవు!
అనేక శుభములనిచ్చే ఏకదంతుడవు నీవు!
చల్లని చూపులతో దయ కురిపించే కరుణాసాగరుడవు నీవు!
శ్రీ మహాగణపతీ! నీకు సర్వదా నమస్సులు.

# దైవ ప్రార్థన

ఛలాదాకలయ్య త్రిలోకీం బలీయో
బలిం సమ్బ్రబద్ధ త్రిలోకీ బలీయా
తనుత్వం దధానా తనుం సన్దధానో
విమోహం మనో వామనో వః స కుర్యాత్.

ఏ మహనీయుడు ప్రపంచమునంతను తన మూడు పాదములచే కొలచివైచి బలిచక్రవర్తిని ఓడించెనో, పొట్టి రూపమును ధరించిన అట్టి వామనమూర్తి జనుల మనస్సులందలి అజ్ఞానమును తొలగించివేయుగాక! వామనమూర్తియగు అట్టి భగవంతునకు నమస్కారము.

All that was good in the past must be preserved and the doors must be kept open for future additions.

భూతకాలపు ఉత్తమ వస్తువును పదిలమొనర్చుకొని, భావికాలపు క్రొత్త క్రొత్త మంచి వస్తువులను దానితో చేర్చుకొనుటకై తలుపులను ఎల్లపుడు తెఱచియేయుంచుము.



**T**he Vedanta says that within man is all knowledge even in a boy it is so- and it requires only an awakening, and that much is the work of a teacher.

మానవునియందు అఖండప్రజ్ఞ కలదనియు, చిన్నపిల్లవానియందు కూడ అట్టి ప్రజ్ఞ కలదనియు వేదాంతము చెప్పుచున్నది. దానిని మేలుకొల్పవలెను. అంతమాత్రమే చేయవలసిన పని. గురువు చేయునది అట్టి పనియే. ౧౦

Man travels from lesser truth to higher truth, not from untruth to truth.

మనుజుడు చిన్న సత్యమునుండి పెద్ద సత్యమునకు ప్రయాణము చేయునేకాని అసత్యమునుండి సత్యమునకు గాదు.

(విగ్రహారాధనను సమర్థించుచు ఒక మహనీయుడు పై వాక్యమును బల్కెను.)



# శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



దేహః కిమన్నదాతుః
స్వం నిషేక్తుర్మాతురేవ చ
మాతుః పితుర్వా బలినః క్రేతురగ్నేః
శునోఽపి వా.
ఏవం సాధారణం దేహమవ్యక్త
ప్రభవాప్యయమ్
కోవిద్వానాత్మ సాత్కృత్వా హన్తి
జన్తూన్నృతేఽసతః.

*(భాగవతం 10-10-11-12)*

ఈ దేహము ఎవరిది?

అన్నము పెట్టి పోషించువానిదా? పుట్టించిన తండ్రిదా? తొమ్మిది నెలలు మోసిన తల్లిదా? తల్లిని కనినట్టి తాతదా? దీనిచేత పనిచేయించు బలవంతునిదా? శ్మశానములో దీనిని కాల్చివేయు అగ్నిదా? రుద్రభూమి యందు దీనిని కొఱికి కొఱికి తినివేయు కుక్కలదా?

అని భాగవతకారుడు నిలదీసి ప్రశ్నించుచున్నాడు. భాగవతము దశమస్కంధములో నారదుడు నలకూబర, మణిగ్రీవులను దేవపుత్రులకు కావించిన హితోపదేశ సందర్భమున ఈ ప్రశ్న కావింపబడెను. ఆ

ప్రశ్నకు నారదులే ఈ ప్రకారముగ సమాధానము ఒసంగివెవిరి—

"నాయనలారా! ఈ దేహము ఎవరిదీ కాదు. ఇదియొక సామాన్య మైన జడవస్తువు. మృత్తికానిర్మితమగు ఘటమువంటిది. ప్రకృతినుండి పుట్టి ప్రకృతిలో లయమైపోవుచున్నది. ఇట్టి అల్పవస్తువును 'నేను' అని తలంచి ఇతరులకు కీడుచేయుదలంచువారు ఎంత అవివేకులు?"

కావున నశ్వరమై, పాంచభౌతికమైనట్టి ఈ శరీరము తాను కాదనియు, శాశ్వతమగు చిన్మయ ఆత్మయే తాననియు బాగుగ నిశ్చయించుకొని, సర్వప్రాణులు తన స్వరూపమేయని భావించుకొని, ఎవరికిని అపకారము చేయక జీవితమును గడుపవలయును.

మానవునికి కలుగుచున్న దుఃఖమంతటికిని కారణము దేహాభిమానమే. దేహముపైనను, దేహమునకు బయటగల పదార్థములపైననుగల మమత్వమే దుఃఖమునకు హేతువు. జీవుడు ఉపాధిని ధరించి లోకమున వ్యవహరించుచున్నప్పటికిని ఆ ఉపాధితోగాని, లోకవ్యవహారములతోగాని సంగము లేనివాడై, వానియందు తగుల్కొనక బహు జాగ్రత్తగా వర్తించుచుండ వలెను. పంచకోశ వివేకముచేతను, సాంఖ్య విచారణచేతను ఆత్మస్వరూపుడగు తనయొక్కయు, అనాత్మస్వరూపమగు ప్రపంచము యొక్కయు యథార్థ స్వరూపము చక్కగ తెలిసికొని, దేహాదులతో వాస్తవముగ తనకు ఏ మాత్రము సంబంధము లేదని గ్రహించి, నాటకములో దీపము భంగి తాను సర్వసాక్షిగా ఈ జగన్నాటకమును వీక్షించు తటస్థుడేయని గుర్తెఱింగి ప్రశాంతముగ జీవితమును గడుపవలెను.

కార్యముచేయుచున్నను అక్కార్యమునందు తగుల్కొనకయుండుటయే మానవుని విజ్ఞత. దేహమునందున్నను తాను దేహాతీతుడని తెలిసికొని దేహమును సాక్షిగా జూడగల్గుటయే మానవుని గొప్పతనము. అభ్యాసముచే ఇట్టి స్థితి జనులకు తప్పక ఏర్పడగలదు. ఇట్టి దేహాభిమాన రాహిత్యముచే జీవుడు అనుభవించు ఆనందము వర్ణనాతీతము. దుఃఖము లవలేశమైనను అత్తఱి అతనికి సోకకుండును.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే [illegible]
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి [illegible]

అని గీతాచార్యులు అట్టి మహోన్నత స్థితిని గూర్చి వర్ణించియున్నారు. దేనిని పొందినచో ఇక ఇతరములగు లాభములన్నిటిని అంత గొప్పగా చూడడో, దేనియందు నిలకడగలిగియున్నచో ఘోరదుఃఖము వచ్చి నెత్తిన పడినప్పటికి ఏ మాత్రము చలింపడో అట్టి ఆత్మస్థితి దేహాభిమానరహితునకే సిద్ధించగలదుగాని అన్యునకు కాదు. తాను జడమైన దేహమని తలంచుకొనుచుండువాడెవడును అట్టి పవిత్ర స్థితిని బడయ జాలడు. సంసార సాగరముయొక్క ఆవలియొడ్డును చేరజాలడు.

ఒకానొక యాత్రికుడు పాదచారియై తీర్థయాత్ర చేసికొనుచు పోవు చుండ త్రోవలో ఒక నది అడ్డువచ్చెనట. ఆ సమయమున సూర్యు డస్తాద్రిఁగ్రుంకెను. చీకటి నలుదెసల వ్యాపించెను. నదియొడ్డున ఒక్క పడవగాని, పడవ నడుపు మనుష్యుడుగాని ఎవరును లేరు. కాని దూరముగ ఒకచోట నదియొడ్డున నల్లటి మొద్దు ఒకటి పడియుండుటను గాంచి అది కొయ్యయని భావించి దానిపై కూర్చొని అతడు నెమ్మదిగ దానిని నీటి లోనికి నెట్టెను. అది కదిలిపోవుచుండెను.

ఈ ప్రకారముగ అతడు నదీమధ్యభాగమువఱకు రాగా, ఆకాశము మేఘావృతమై మెఱవు మెఱయగా ఆ మెఱవు కాంతిలో ఆ కొయ్యమొద్దును పరికింప అది కొయ్యకాదనియు మొసలియనియు తేలినది. ఇట్టి పరిస్థితి యందు ఆ యాత్రికుడు ఆవలియొడ్డుకు చేరగలడాయని శ్రీ శంకరా చార్యులవారు ప్రశ్నించుచున్నారు. ఎన్నటికిని చేరలేడు. భయంకరమైన ఆ మొసలి త్రోవలోనే అతనిని కబళించివైచును. అట్లే 'నేను దేహమును' అను భావము కలవాడెవడును ఆత్మను దర్శింపలేడు. సంసారసముద్రమును దాటలేడు. దుఃఖజాలమును తొలగించుకొనలేడు.

ఈ శరీరము వాస్తవముగ బంకమట్టితో చేయబడిన ఒకానొక ఇల్లు. ఇది కొద్దికాలము నివసించుట కొఱకు భూదేవినుండి బదులుగ తీసికొన బడినది. తిరిగి ఆ భూదేవికి దీనిని సమర్పించివేయవలసియున్నది. ఎల్ల

కాలము దీనిలో నివసించుటకు అనుమతి లేదు. ఇది సొంత ఇల్లు కాదు. అద్దె కొంప. అద్దె కొంపలో శాశ్వత నివాసము సాధ్యపడదు. ఏదియో యొక కాలములో లేవవలసినదే. అట్టిచో దానిపై అంతమమత్వమేల? బాగుగ విచారించి చూచినచో దేహముపైగాని, దేహము నాశ్రయించుకొనియుండిన బాహ్యవస్తువులపైగాని, బంధ్వాదులందుగాని మమత్వము కేవలము కల్పితమేయని తేలుచున్నది. కాబట్టి అట్టి కల్పితభావములను విసర్జించి తాను జడమైన పదార్థము కాదనియు నిత్యశుద్ధబుద్ధముక్త ఆత్మస్వరూపమేయనియు దృఢముగ నిశ్చయించవలయును. దుఃఖరాహిత్యమునకు, బంధవిముక్తికి ఇదియొకటియే మార్గము.

నాన్యః పన్థా విద్యతేఽయనాయ.

దేహాభిమానమను పాశముచే జీవుడు అనాది కాలమునుండియు బద్ధుడై, తత్ఫలితముగ ఈ జనన మరణ రూపప్రవాహమునందు దిక్కులేక కొట్టుకొనిపోవుచున్నాడు. సుకృతవశమున లభించిన ఈ పరమపవిత్ర మానవజన్మయందు ప్రయత్నపూర్వకముగ జ్ఞానమను ఖడ్గమును సంపాదించి నేను దేహమును కాదు, దేహసాక్షియగు ఆత్మను, అను వివేకమును లెస్సగబడసి, దేహాహంభావరూపపాశమును ఆ ఖడ్గముచే ఛేదించివైచి పరమ సుఖమును బొందవలయును. తాను జడస్వరూపుడు కాదనియు, కేవలము చిదాత్మయేయనియు మరల మరల మననము చేయుచుండ వలయును.

చిదానందరూపశ్శివోఽహం శివోఽహమ్.

అని ఎలుగెత్తి పాడుచుండవలెను. జన్మాంతర సంస్కారమువలన తాను దేహమను భావన కలిగినప్పుడెల్ల, తద్విరోధియగు ఆత్మసంస్కారమును మరల మరల తెచ్చుకొనుచు అవివేకమును పారద్రోలుచుండవలెను.

నాస్తి జాగరతో భయమ్.

జాగ్రతగ నున్నవానికి, వివేక విషయమున మేలుకొనియున్నవానికి, దుఃఖమును గూర్చిన భయము లవలేశమైనను వుండనేరదు. కాబట్టి ముముక్షువులగువారు దేహాభిమానమును దరికిజేర్చక, ఆత్మ చింతన పరులై, జీవితమును పరమానందమయముగ నొనర్చుకొందురుగాక! ( )

# దైవ ప్రశస్తి

## శ్రీ డా॥ దేవీశంకర్ గారు (హైదరాబాద్)

సూర్యునెవరు ఉదయించమన్నారు?
చంద్రునెవరు ప్రకాశించమన్నారు?
నక్షత్రాలనెవరు మెరయమన్నారు?
నవగ్రహాలనెవరు నడుపుమన్నారు?
మేఘాలనెవరు గర్జించమన్నారు?
వర్షాన్ని ఎవరు కురియుమన్నారు?
వాయువునెవరు వీచమన్నారు?
ప్రళయమునెవరు కానించమన్నారు?
హిమమునెవరు కురియుమన్నారు?
చెట్లాకులనెవరు రాలమన్నారు?
పూలనెవరు పూయమన్నారు?
పూలలో రంగులనెవరు వేసారు?
అంతటా సుగంధాలనెవరు నింపారు?
లోకములో షడ్రుచులనెవరు కలిగించారు?
నీలో మాట్లాడువాడు ఎవరు?
ప్రాణికోటిలో మెలగే "జీవి" ఎవరు?
ఈ సృష్టి బ్రహ్మాండములనెవరు నడుపుతున్నారు?
ఓ మానవా! ఇప్పుడైనా తెలిసిందా నీకు?
ఏదో అద్భుతశక్తొకటి నడుపుచున్నది.
నిన్ను, నన్ను అంతటిని నడుపుచున్నది.
అదియే అద్భుతశక్తి.
అదియే అనంతశక్తి.
అదియే దేవుడు.

OO

# ఆనందుని ప్రశ్న కథ

ఆనందుడు వరుసకు బుద్ధుని తమ్ముడౌతాడు. శుద్ధోదనుని తమ్ముడైన అమితోదనుని కుమారుడు. అతడు జనించినప్పుడు శాక్యవంశీయులందరూ ఆనందించారు కనుక అతనికి ఆనందుడని పేరు పెట్టారు. ధర్మ చక్ర ప్రవర్తనం రెండవ సంవత్సరంలో శాక్యవంశీయుల్లో ప్రముఖులైన యువకులు ఆనందుడు, అనిరుద్ధుడు, దేవదత్తుడు మొదలగువారు సంఘంలో చేరారు.

ధర్మ చక్రప్రవర్తనం మొదటి ఇరవై సంవత్సరాలు బుద్ధుడికి స్థిరమైన సేవక శిష్యులెవరూ నియమితులు కాలేదు. తన ఏభై ఐదవఏట బుద్ధుడు ఒకనాడు శిష్యుల నుద్దేశించి "ఇప్పుడు నేను వృద్ధుడనౌతున్నాను. నాకు సహాయంగా ఎప్పుడూ నా దగ్గర వుండే సేవక శిష్యుణ్ణి ఒకడ్ని ఎన్నుకోండి" అన్నాడు. వెంటనే సారిపుత్రుడు మొదలగు శిష్యులందరూ "నేను నేను" అని ముందుకు వచ్చారు. బుద్ధుడు అంగీకరించలేదు. ఆనందుడు మాత్రం మౌనంగా కూర్చున్నాడు. తక్కిన శిష్యులందరూ ఆనందుడే సేవక శిష్యుడుగా తగినవాడని నిర్ణయించి అతణ్ణే వుండమన్నారు. అందుకు బుద్ధుడు అంగీకరించి ఆనందుని తన సేవక శిష్యునిగ ఎంచుకొన్నారు.

అప్పటినుండి బుద్ధుని పరినిర్వాణం వరకు అంటే ఇరవై ఐదేండ్లు విడువకుండా ఆనందుడు అకుంఠితమైన అంకితభావంతో సేవలు చేసినాడు.

అట్టి ధన్యజీవియైన ఆనందుడు ఒకనాడు జేతవనంలో ఏకాంతంగా కూర్చొని ఇలా ఆలోచించాడు : పుష్పాలనుండి కొన్ని చెట్లు, మూలికలనుండి పరిమళాలు వ్యాపిస్తాయి. కానీ గాలివీచినవైపునకే వ్యాపిస్తాయి. గాలికి ఎదురుగా వ్యాపించవు. గాలివాటుమీద ఆధారపడకుండా అన్నిదిక్కులకు వ్యాపించే పరిమళం ఏదైనా

లోకంలో వుందా? అని ప్రశ్న లేవదీసుకొని అక్కడ్నుంచి లేచి బుద్ధుని సేవకు వెళ్ళాడు. బుద్ధుని చూడగానే ఆయన తన ప్రశ్నకు ఎలా సమాధానం చెప్తారో వినాలని ఆ ప్రశ్న వేశాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా బుద్ధుడు "స్వార్థచింతనను వీడి కేవలం లోక హితాన్ని లక్ష్యంగా పెట్టుకొని ఆ లక్ష్యసాధనలో భాగంగా దానపారమిత (perfection in giving), శీలపారమిత, వీర్యపారమిత, ధ్యానపారమిత, ప్రజ్ఞాపారమితలను గడించే సాధుజనుల కీర్తిపరిమళాలు అన్ని దిక్కులకు వ్యాపిస్తాయి. "దేవాది లోకాలకు కూడా వ్యాపిస్తాయి" అని చెప్పి క్రింది రెండు శ్లోకాలను పఠించాడు.

–ధర్మపదం 4–11

పుష్ప పరిమళాలు గాలికి ఎదురుగా వ్యాపించవు. చందన గంధం, అగరు గంధం, మల్లెపుష్పాల గంధం కూడా గాలికి ఎదురుగా పోజాలవు. సత్పురుషుల కీర్తి పరిమళాలు మాత్రమే గాలికి ఎదురుగా కూడా పోగలిగి అన్నిదిక్కులూ వ్యాపిస్తాయి.

ఏతేషాం గంధ... –ధర్మపదం 4–12

చందనం, అగరు, కమలం, మల్లె మొదలగు పరిమళాల కంటే శీలసంపత్తి పరిమళం మిక్కిలి శ్రేష్ఠమైనది. ○○

ఓం

**ఒక భక్తుడు– స్వామీ! నాకేమీ అక్కర్లేదు. ఒక్క మోక్షం ఇస్తే చాలు. అనుగ్రహించండి.**

**శ్రీ రమణ మహర్షులవారు– ఏమీ అక్కర్లేకపోవటమే మోక్షం. ఇక ఒకరిచ్చేదేమిటి?**



1. రామచంద్ర రఘువీర । రామచంద్ర రణధీర
రామచంద్ర రఘునాథ । రామచంద్ర జగన్నాథ
2. రామచంద్ర మమబంధో । రామచంద్ర దయాసింధో
రామచంద్ర రఘురామ । రామచంద్ర పరంధామ
3. శ్రీ రఘునందన సీతారమణ । శ్రితజనపోషక కమలానాధా
కారుణ్యాలయ కలుషనివారక । కమలాకాంతా కరివరదా
4. భజరే శ్రీరామం । మానస భజరే శ్రీరామం
సీతారామం । చిన్మయధామం
శ్యామలగాత్రం । పావనచరితం
5. రఘుపతి రాఘవ రాజారాం । పతితపావన సీతారాం
సుందర మాధవ మేఘశ్యాం । గంగా తులసీ సాలగ్రాం
భద్రగిరీశా సీతారాం । భక్తవత్సలా సీతారాం
6. హరి నారాయణ గోవింద । అర్జున సారథి గోవింద
పురాణ పురుషా గోవింద । పుండరీకాక్షా గోవింద
భక్తపోషకా గోవింద । పండరినాథా గోవింద
దుర్జన సంహర గోవింద । దశరథ నందన గోవింద
7. దానవమర్దన దశరథ నందన । తాపసరంజన శ్రీరామా!
తాపవిదారణ తత్త్వవిచారణ । జానకి నాయక శ్రీరామా!
జ్ఞానప్రదీపక సజ్జనరక్షక । సర్వ విధాయక శ్రీరామా!
8. సీతాపతే దాశరథే । దశరథనందన దయానిధే
రాధాపతే మహీపతే । దేవకినందన కృపానిధే
9. రామ రామ రామ సీతా । రామా రఘురామా
దశరథనందన దానవభంజన । జయ జయ శ్రీరామా.

OO

# మహాలాభము

ప్రపంచములోని అన్ని లాభములకంటె గొప్పలాభము ఆత్మానందమే. కావున ధ్యానయోగి అద్దానిని బడసినప్పుడు దానినే సర్వోత్తమలాభముగ నెంచి తక్కిన ప్రాపంచిక లాభములన్నిటిని దానిముట్టు దిగతుడిచివేయును లోకములో ప్రతి జీవియు లాభమునే కోరును. వర్తకుడు ధాన్యమును కొలుచుటకు ప్రారంభించునపుడు 'ఒకటి' అనకుండ 'లాభం' అనుచుండును. కాని ప్రాపంచిక లాభముల నెన్నిటిని పొందినను అవి కొంతకాలమునకు నశించిపోవును ఒకవేళ అవి నశింప కున్నను అనుభవించు తన ఉపాధియైనను ఒక కాలమున నశించిపోవును.

కావున అవి పరమలాభములు కావు. క్షణిక లాభములే ఆత్యంతికశాంతి, జనన మరణ దుఃఖరాహిత్యము, నిరతిశయసుఖము కలుగజేయు ఆత్మానుభవమే పరమ లాభము. కనుకనే అద్దానిని పొందినవాడు తక్కిన ఏ ఇతర వస్తువునుగాని, లాభమును గాని, తుదకు బ్రహ్మాండాధిపత్యమునుగాని అధికముగా తలంపడు. కాబట్టి వివేక వంతుడగువాడు గీతోక్త భగవద్వాక్యముపై విశ్వాసముంచి నశ్వర ప్రాపంచిక లాభము లకై దేబరించి చూడక, క్షణికములగు దృశ్య వస్తువులయొక్క సంపాదనమందే కాలమును వ్యర్థముచేయక ఆత్మప్రాప్తికై యత్నించవలెను.

అట్టి ఆత్మస్థితియందున్నవాడిక ఎట్టి భయంకర దుఃఖము వచ్చి మీద పడినను చలింపడు. సర్వదుఃఖనివారణోపాయము ఆత్మ సాక్షాత్కారమే అయి యున్నది. స్వప్నమందలి ఆపదలు మేలుకొనినవానిని కష్టపెట్టజాలనట్లు ఆత్మాను భవపరుని మహాదుఃఖముకూడ రవంతైనను కదలింపజాలదు. ఇక సామాన్య దుఃఖ మును గూర్చి వేఱుగ జెప్పవలెనా? ఆత్మజ్ఞానము లేనివానిని, దేహాభిమానిని, దృశ్యము సత్యమని నమ్మువానిని చిన్నదుఃఖముకూడ తలక్రిందు చేయగలదు. 'గోష్పదం సాగరాయతే' అనునట్లు గోవుపాదమంత దుఃఖము వానికి మహాసాగరముగ

*(తరువాయి 26వ పేజీలో)*



# శ్రీ గురువాయూర్

## ఓంప్రకాశ్

తిరుచూర్ స్టేషను నుండి 30 మైళ్ల దూరంలో గురువాయూర్ ఉంది. మద్రాసు-మంగళూర్ లైనులో షోరానూర్ ఉంది; షోరానూర్ నుండి కొచ్చిన్ వెళ్లే మార్గంలో, 21 మైళ్ల దూరంలో 'తిరుచూర్' వస్తుంది. తిరుచూర్ బస్సు ద్వారా గురువాయూర్ వెళ్లవచ్చు. ఈ క్షేత్రంలో 'శ్రీ గురువాయూరప్ప' దేవుని ఆలయముంది. ఆలయ అధికారులే యాత్రికులుండేందుకు ఏర్పాట్లు చేస్తారు; బాడుగ మాత్రం ఇవ్వాలి.

ద్వారకలో దేవకీ వసుదేవులు అర్చించే విగ్రహం ఉండేది. సముద్రంలో ద్వారక మునిగిపోకముందే, ఆ విగ్రహాన్ని సురక్షిత స్థలంలో ప్రతిష్ఠించమని శ్రీకృష్ణుడు బృహస్పతికి కబురు చేశాడు. బృహస్పతి వచ్చేలోగా, ద్వారక సముద్రంలో మునిగిపోయింది. ఆ దేవగురువు, వాయువు సహాయంతో ఆ విగ్రహాన్ని తీయించి, దాన్ని నేడు గురువాయూర్ ఉన్న స్థలానికి తెచ్చాడు. అప్పుడక్కడ జలక్రీడలో ఉన్న శివపార్వతులు, ఆ విగ్రహాన్ని అక్కడ ప్రతిష్ఠింపచేశారు. దేవగురువు ప్రతిష్ఠించడంచేత, ఈ క్షేత్రనాథుడు గురువాయురప్పన్‌గా ప్రసిద్ధి పొందాడు.

దీనికి దగ్గరలో మమ్మీయూరప్పన్ అనే పేరుతో శివుని ఆలయం ఒకటి ఉంది. దీని నిర్మాణం ఎంతో ఉత్కృష్టంగా ఉంటుంది.

పాండ్య దేశ రాజు సమయంలో గురువాయూర్ మందిరం శిథిలమై ఉండేది.

అది చూసి ఆ రాజు దానిని మరల నిర్మింపచేశాడు. ఆ పుణ్యకార్యంవలన అతనికి సర్పగండం తప్పిపోయిందని చెబుతారు. ఆ తర్వాత కూడా ఆలయాన్ని ఎన్నో మార్లు మార్పులు చేస్తూ వచ్చారు.

బ్రహ్మ సృష్టికార్యంలో ఉన్నప్పుడు, విష్ణుభగవానుడు తన నిజమూర్తిని అతనికిచ్చాడు. బ్రహ్మ సృష్టి అనంతరము, ఆ విగ్రహాన్ని సుతాప ప్రజాపతికి ఇచ్చాడు. ఆ ప్రజాపతి నుండి కాలక్రమంలో ఆ విగ్రహం ధౌమ్యమహర్షికి లభించింది. ధౌమ్యుడు దానిని వసుదేవునికిచ్చాడు. వసుదేవుడు, ద్వారకలో దానిని ప్రతిష్ఠించాడు. జనమేజయ మహారాజు ఈ విగ్రహాన్నే ఆరాధించి, దేహ రోగాన్నుండేకాక, భవ రోగాన్నుండి కూడా ముక్తి పొందాడు. తర్వాత ఆ విగ్రహం గురువాయూర్ క్షేత్రంలో స్థాపితమయింది.

గురువాయూర్ ఆలయంలో ఆదిశంకరుడు కొంత కాలంపాటు ఉన్నాడని, కొన్ని సవరణలు-అర్చనా విధానంలో మార్పులు చేశాడని చెబుతారు. శ్రీ లీలాశుకుడు (బిల్వమంగళుడు) కూడా చాలా కాలం ఇక్కడ గడపాడంటారు...ఇంకా మరెందరో భక్తులు-సాధువులు ఈ క్షేత్రంలో ఉండేవారంటారు.

ఒక రైతుకు ఒక కొబ్బరి తోట ఉండేది. మొట్టమొదటి కాపు నుండి కొన్ని టెంకాయలను, గురువాయురప్పన్‌కు సమర్పించటానికి తీసుకుని వచ్చాడు. మార్గంలో కొంతమంది దోపిడీ దొంగలు అతన్ని పట్టుకున్నారు. కొబ్బరికాయలు తప్ప, మిగతావన్నీ తన నుండి తీసుకోమని రైతు కోరాడు. ఆ మాట విని, "ఏమిటీ, గురువాయూరప్పన్ టెంకాయలకు కొమ్ములు మొలిచాయా?" అని అడిగారా దొంగలు. ఆ మాటలన్నారో లేదో, నిజంగానే టెంకాయలకు కొమ్ములు వచ్చాయి. ఈ అద్భుతాన్ని చూసి దొంగలు బెదిరిపోయారు. ఆ కొమ్ముల కొబ్బరికాయలు ఆలయంలో నేటికీ ఉన్నాయి.

విష్ణుభగవానుని క్షేత్రాలలో, గురువాయురు క్షేత్రం గొప్ప మహిమగలదంటారు. ఆ గురువాయురప్పన్ దర్శన మాత్రం చేతనే సర్వ అనర్థాలు తొలగిపోతాయంటారు.

కాబట్టి, వైష్ణవులేకాక, అందరూ ఈ గురువాయురప్పన్‌ను దర్శించి, సిద్ధి పొందగలరు.

# మహాత్ముల ప్రబోధము

## రమణ బోధ

జనులకు తమ తమ స్వరూపములను గూర్చిన సరియైన అవగాహన లేదు అనాదికాలమునుండి దేహముతోను, బుద్ధితోను వారు తాదాత్మ్యము పొందియున్నారు. కాబట్టి ప్రతివారును ముందుగా తామెవరో విచారించుకొనవలసియున్నారు ఆత్మ మనస్సుకు ఆవలనున్నది. అది అనంతమైనది శాశ్వతమైనది. దానినే కొందఱు స్వర్గరాజ్యమనియు, మోక్షమనియు, నిర్వాణమనియు పేర్కొందురు. ఆత్మాన్వేషణలో నిమగ్నుడు కానంతవరకు మనుజునకు జీవితమందు అడుగడుగునా సందేహము, అనిశ్చయత్వము కలుగుచుండును. కాని తమ్ము తాము తెలిసికొనినవారికి అవి యన్నియు అదృశ్యములై, ఒక మహాశక్తి లభించుచున్నది. మనుజుడు తనను తాను తెలిసికొనక ప్రపంచములో ఇతరమైనవానినన్నింటిని తెలిసికొనినను ప్రయోజనము లేదు. తనను తాను విచారించుటకంటె ఉత్తమమైన, పవిత్రమైన కార్యము మఱి యొకటి ఏదియు లేదు. నిరతిశయానందము, పరమశాంతి మనుజుని వాస్తవ స్వరూపము. కాబట్టియే అతడు దానిని సతతము కాంక్షించుచున్నాడు. తన నిజస్వరూపమగు ఆత్మను తిరిగి పొందుటకొఱకై అతడు అన్వేషణ ప్రారంభించుచున్నాడు. ఆత్మను కనుగొనినచో సమస్తమును కనుగొనినట్లే. ○○

### ఉవాచ

గోవిందేతి పరం బ్రహ్మ గోవిందేతి త్రియక్షరమ్
సకృదుచ్చరితం యేన విష్ణోస్సాయుజ్య మాప్నుయాత్

గోవింద అనునది పరబ్రహ్మము యొక్క వాచకము. గోవింద [illegible]

[illegible] సాయుజ్యమును బొందును.

# ఆధ్యాత్మిక  కథలు

## మమత్వమే దుఃఖకారణము

అది ఒక మహాపట్టణము ఆ పట్టణమందు నివసించు వేలాదిమంది జనులు వివిధ వృత్తులను చేసుకొనుచు కాలము గడుపుచుండిరి కొందరు వ్యాపారస్థులు, మరికొందరు ఉద్యోగులు, ఇంకొందరు వ్యవసాయదారులు, మరికొందరు పరిశ్రమల నిర్వాహకులు–ఇట్లు పలు వృత్తులవారు జీవించుచుండిరి ఒకానొక వీధిలో ఒక ఉద్యోగి కలడు అతడు స్వయంకృషి వలన ఉన్నత పదవిలోనికి వచ్చియుండెను. కొన్ని సంవత్సరములకు ఉద్యోగ విరమణ గావించి విశ్రాంతి గైకొనుచుండెను. అతనికి తనవారు అనుకొను బంధ్వాదులు ఎవరును లేరు. చాలాకాలము క్రితమే అతని బంధ్వాదులు గతించిపోయిరి. కాని ఒక్కగానొక్క మనుమడు మాత్రము గలడు.

ఆ ఏకైక మనుమని పైననే ఆతడు తన ఆశలన్నిటిని పెట్టుకొని శేషజీవితమును గడపసాగెను. వాని యెడల మిక్కుటమగు మమకారమును పెంచుకొని, వానిపై పంచప్రాణములను పెట్టుకొని పెంచసాగెను. మనుమడు 10 ఏళ్ళ వయస్సుగలవాడయ్యెను. ఆ పిల్లవాని ఆయుః ప్రమాణము పూర్తయిసందువలన వాడు మృతినొందెను. ఆ ఎడబాటుకు ఆ వ్యక్తిలో కలిగిన దుఃఖమునకు మేరయే లేకుండెను. ఇరుగు పొరుగు వారు ఓదార్చసాగిరి కాని అతనిలో విషాదము, బాధ ఏమాత్రము తగ్గలేదు. ఆ చింతతోడనే అతడు భారముతో రోజులు గడుపసాగెను.

ఆ పట్టణమునకు కొలది దూరములో పారమార్థిక జ్ఞానసంపన్నుడగు ఒక సాధుపుంగవుడు ఆశ్రమము నొకదానిని నిర్మించుకొని ప్రశాంత

జీవితమును గడుపుచుండెను. తన కడకు వచ్చిన జనులకు ఉపదేశము గావించుచు, ఆ మహాత్ముడు వారి సమస్యలను, దుఃఖములను తొలగించు చుండెను. అమ్మనీశ్వరుని యెడల పరిసరప్రాంతమందలి మనుజులు మిక్కుటమగు భక్తిశ్రద్ధలు కలిగియుండిరి.

ఆ సాధువరేణ్యుని జనులు సాక్షాత్ దైవస్వరూపుడుగ భావించుచు తరచుగ అమ్మహనీయుని దర్శించుచుండిరి.

కథానాయకునకు సాధువు గారిని గురించి ఎవరో తెలియజేసిరి. దుఃఖోపశమనమునకు ఆ వ్యక్తి ఆశ్రమమును చేరి సాధుపుంగవునకు సాష్టాంగవందనమాచరించెను. తదుపరి ఒక ప్రక్కన విషాదవదనముతో కూర్చుండెను. ఆతని దిగులును, దుఃఖమును గమనించిన సాధువరేణ్యుడు, "నాయనా! నీవేల దుఃఖముతో నుంటివి? నీ విషాదమునకు కారణమేమి?" అని మృదువుగ ప్రశ్నించెను.

తదుపరి వారిరువురికి ఈ క్రింది సంభాషణ జరిగెను.

వ్యక్తి : మహాత్మా! కొంతకాలము క్రితమే నా ఏకైక మనుమడు గతించి నాడు. వాడిపైననే నేను ఎన్నియో ఆశలను పెట్టుకొనియుంటిని. నా బంధువులు కూడ నాకు చాలా కాలము క్రితమే దూరమైరి. నేనిపుడు ఏకాకినైతిని. ఒక్కగానొక్క మనుమడు లేని కొరత నన్ను మిక్కిలి బాధించుచున్నది. నా దుఃఖము తొలగు ఉపాయము కానరాకున్నది.

సాధువు : వత్సా! దిగులునొందకుము. పుట్టినవాడు మరణించక తప్పదు. కర్మశేషమున్నంతవరకు మరణించినవాడు జన్మింపక తప్పదు. కర్మ రాశి యున్నంతవరకు జీవుడు జనన మరణ చక్రమున తగుల్కొని యుండును. మనుజునకు ఋణానుబంధమువలననే భార్య, పుత్రులు, బంధువులు ఏర్పడుదురు. వారి వారి ఆయుఃప్రమాణములు పూర్తి కాగానే మరణింతురు. ఈ విషయమెఱింగి నీవు శోకింపవలదు. నదీ ప్రవాహములో రెండు కట్టె పుల్లలు కొంతసేపు కలసి ప్రయాణిం

చుచు, మరికొంతసేపటికి విడిపోవును. చీకటిపడు వేళకు పక్షులన్నియు చెట్టు పైకి వచ్చి చేరును. తెల్లవారగనే దేనికది వేరైపోవును. అదే రీతిని కర్మానుబంధము, ఋణానుబంధము ఉన్నంతవరకు బంధువులు కలసి జీవించియుందురు. తదుపరి ఎవరి గమ్యమునకు వారు వెడలి పోవుదురు. నాయనా! ఇంకొక సత్యమును బాగుగ తెలుసుకొనుము. ఈ జన్మయందలి నీ బంధువుల మరణముపట్ల నీవు దుఃఖించుట భావ్యమగుచో, గతించిన జన్మలందలి బంధ్వాదులను గురించి నీవేల శోకించుటలేదు?

వివేకవంతుడైనవాడు జీవించియున్నవారిని గురించిగాని, మృతినొందిన వారిని గురించిగాని శోకించడు. ఈ దేహములు వచ్చును, పోవును. కాని దేహియగు ఆత్మ శాశ్వతము, సనాతనము, నాశరహితము. శరీరము నశించినను శరీరియగు ఆత్మ నశించుటలేదు. ప్రతి జీవియు అవినాశియగు ఆత్మస్వరూపుడు. కావున వత్సా! నీవిక శోకించుట వదలిపెట్టుము. తోటివారి యెడల నీ ధర్మమును, కర్తవ్యమును నిర్వర్తించవలెనేకాని వారిపై మమకారమును, అభిమానమును పెంచుకొన రాదు. అసంగబుద్ధితో, దైవార్పణ బుద్ధితో కర్మలనాచరించుచో నీవు బద్ధుడవు కానేరవు, ఎన్నడును దుఃఖమును పొందనేరవు. దుఃఖ రాహిత్యమునకు, ఆనందప్రాప్తికి ఉపాయము ఆత్మజ్ఞాన సంపాదనమే అయి యున్నది. కావున అద్దానికొరకై నీవు నిష్కామముగ, భగవ దర్పణ భావముతో వ్యవహారమాచరించుచు శాంతి సుఖముల నొందుము.

ఈ దివ్యబోధనాలకించి ఆతడు శోకరహితుడు, దుఃఖరహితుడు అయ్యెను. సాధుమహాత్ముని ఉపదేశానుసారము ఆచరించుచు శాంత జీవనము గడపసాగెను.

బంధ్వాదుల యెడల తన కర్తవ్యమును నిర్వహించవలెనేకాని

# ఆత్మానుసంధానము

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

నిషేధే కృతే నేతి నేతీతి వాక్యైః
సమాధిస్థితానాం యదాభాతి పూర్ణమ్,
అవస్థాత్రయాతీతమేకం తురీయం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి.

'ఇది ఆత్మ కాదు, ఇది ఆత్మ కాదు' అను వాక్యములచే సమస్త దృశ్యము నిషేధింపబడగా సమాధి స్థితులగువారికి ఏది అనుభూతమగుచున్నదో అట్టి పూర్ణమై, అవస్థాత్రయాతీతమై, ఏకమై, తురీయమై, నిత్యమైనట్టి బ్రహ్మమేది కలదో అదియే నేను అయియున్నాను. ○○

వారిపై మమకారమును, అభిమానమును పెంచుకొనరాదు. మమత్వమే, అహంభావమే జీవుని బంధమునకు కారణములు. మమత్వరహితముగ, అహంభావరహితముగ విధ్యుక్తకర్మలనాచరించినచో మనుజుడు బంధ విముక్తిని, ఆత్యంతిక శాంతిని బడయగలడు.

నీతి : మమత్వమే బంధ కారణము. బంధువులు తనవారని, వారెల్లపుడు తనతోపాటు శాశ్వతముగ ఉందురని తలచుట కేవలము అజ్ఞానమే యగును. అనంత కాలప్రవాహములో జీవులు కలుసుకొని కొంతసేపు బంధుత్వమును, మిత్రుత్వమును కలిగియుండి కొంత కాలమునకు విడిపోవుచున్నారు. ఈ విషయమెఱిగి జనులు సతీసుతుల యెడల, బంధుమిత్రుల యెడల మమత్వాదులను పెంచుకొనక ధర్మ పూర్వకముగ వ్యవహరించుచు, భగవద్భక్తిపరాయణులై పరమశాంతిని అనుభవించవలెను. ○○

# పరమహంస సదుపదేశములు

## శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు చెప్పిరి-

1 ప్రపంచమునందు సుఖముకంటె దుఃఖము ఎక్కువగా ఉన్నది. ఆ సుఖము కూడ పూర్ణసుఖము కాదు అది దుఃఖమిశ్రితమైనది. మనుజుడు ప్రాపంచిక సుఖమును కోరినచో దాని వెంట దుఃఖము కూడ వచ్చును. కనుక జనులు దృశ్యవస్తువుల యొక్క సౌందర్యమును చూచి మురిసిపోక వాటి నశ్వరస్వభావమును, దుఃఖస్వభావమును బాగుగ గుర్తెరిగి పరిపూర్ణ ఆనందము నొసంగు ఆత్మవస్తువు కొరకే అన్వేషింపవలెను.

2 శత్రుదేశమున రాజునకు ప్రాణమిత్రుడు లభించినచో అతనికి ఎంతయో ఆనందముగ ఉండును. అదే విధమున త్రివిధ తాపములచే బాధనొందుచున్న జీవుడు దుఃఖము ఏమాత్రము లేని స్థితిని అనగా ఆత్మస్థితిని, దైవస్థితిని పొందినచో అతడు అనంతానందమును అనుభవించగలడు అందులకై మనుజుడు తీవ్రవైరాగ్యమును, భగవద్భక్తిని కలిగి దైవధ్యానము సలుపవలెను. అనన్యభక్తితో ధ్యానము చేసినచో అచిరకాలములోనే అతడు దైవకృపను బడసి పరిపూర్ణానందమును, ఆత్మానందమును అనుభవించును.

3. కుమ్మరివాడు ఒకే మట్టితో కుండలు, మూకుళ్ళు మొదలగు అనేక రకముల వస్తువులను తయారుచేయును. అదే రీతిగ భగవానుడు చరాచర ప్రాణికోట్లుగను, స్థావరజంగను పదార్థములుగను వ్యక్తమై యున్నారు. సృష్టియందు మనుజునకు భిన్నత్వము కనుపించినను, వాస్తవముగ ఏకత్వము కలదనియే ఎరుగవలెను. బహిర్ముఖముగ ప్రవర్తించు ఇంద్రియములను అంతర్ముఖముగ ఒనర్చి, నిశ్చల మనస్సుతో దైవధ్యానము, విచారణాదులను చేయుచో మనసపుడు ఒక్క భగవంతుడే, ఆత్మయే సర్వత్ర వ్యాపించియున్నట్లు అనుభవమును బడయగలడు.

4. అద్వైత జ్ఞానమును సంపాదించుటయే ప్రతివాని యొక్క పరమలక్ష్యము. మొదట మనుజుడు వివేకముతో ఆలోచించి, ఇంద్రియ నిగ్రహమును, వైరాగ్యమును

అభ్యసించవలెను. మహాత్ములనాశ్రయించి వారు బోధించిన రీతి భక్తిశ్రద్ధలతో ధ్యానాది అనుష్ఠానమును, దైవసేవను ఆచరించుచో శీఘ్రకాలముననే అతడు అద్వైతజ్ఞానమును, పరమాత్మజ్ఞానమును బడసి దైవమందు ఐక్యము కాగలడు పెడమార్గమున పోవు కుమారుని, తండ్రి బాధ్యత వహించి అతనిని సన్మార్గమున నడిపించును. ఆలాగుననే అజ్ఞానమార్గమున, అధర్మమార్గమున ప్రవర్తించుచు నానా బాధలనొందుచున్న జనులను చూచి మహాత్ములు దయాహృదయము కలవారై సద్బోధలను గావించి వారిని ధర్మమార్గమున నడచునట్లు చేయుదురు. కనుక జనులు మహాత్ముల ప్రబోధము నాలకించి శ్రద్ధాభక్తులతో ధ్యానాదులను ఆచరించి దుఃఖరాహిత్యమును, ఆనందప్రాప్తిని బడయవలెను. ○○

[illegible]
[illegible]

ఆత్మానందము బింబము, విషయానందము ప్రతిబింబము. ఆత్మయందలి ఆనందమే చిత్తవృత్తిద్వారా దృశ్య విషయములందు ప్రతిబింబించుచున్నది. జీవుడు ఆ విషయానందము ననుభవించుచు 'ఆహా! దృశ్యవస్తువులందెట్టి ఆనందము కలదు?' అని మురిసిపోవుచున్నాడు. ఆత్మానందమును వదలి విషయానందమునకై దేవులాడుచున్నాడు. తన ఇంటియందలి పంచభక్ష్య పరమాన్నమును వదలి పొరిగింటి పుల్లకూరకై అఱ్ఱులు చాచుచున్నాడు. ఒకడు తన ఇంటియందలి పాలు మఱియొకఇంటివానికి కొద్దిగా ఇచ్చి, మఱల సిగ్గులేక ఆతనినే బిచ్చమడిగి ఆ కొద్ది పాలు త్రాగుటకై యత్నించువాని చందముననున్నది అజ్ఞానుల యొక్క ఈ ప్రవర్తన. గురుత్వమేదియో, లఘుత్వమేదియో, తెలియక అజ్ఞానియగు మనుజుడు ఈ విధముగ ప్రవర్తించుచున్నాడు.

*(కాబట్టి విజ్ఞుడగువాడు ప్రతిబింబరూపమగువిషయానందముపై దృష్టినుంచక, బింబభూతమగు నిరతిశయ స్వాత్మానందమునే అనుభవించుగాక!)*

# మనస్సుకు మరమ్మతు

ఈశ్వర్

దానము, అనుష్ఠానము, ఆచరణ అలవరచుకుంటూ మంచి నియమాలతో మనిషి మనస్సు సాగిపోవాలి.

బ్రతకడం ఒక వింతైన, విచిత్రమైన విషయము కాదు. కాని మన బ్రతుకు బండ బ్రతుకు కాకుండా భగవంతుని ప్రీతిని, ప్రేమను పొందు బ్రతుకు కావాలి.

పువ్వు యొక్క గంధాన్ని, సుకుమారాన్ని, రంగుని, ఆకారాన్ని ఏమి చెరపకుండ మకరందాన్ని మాత్రమే సేకరిస్తుంది, స్వీకరిస్తుంది. అలాగే నిజమైన జ్ఞాని సంఘాన్ని బాధించకుండ తన ధర్మాన్ని ఆచరిస్తూ సంఘమునకు తోడ్పడుతాడు. అట్టి జ్ఞాని యొక్క ప్రవర్తనను మనము అలవరచుకోవాలి.

4. ఏనుగు భారీగా, పెద్దదిగా వుంటుంది. వింత వింత చేష్టలు అది అప్పుడప్పుడు చేస్తూంటుంది. అందులో ముఖ్యంగా నెత్తిన మన్ను, దుమ్ము కొట్టుకుంటుంది. దానివలన ప్రక్కనున్న మరో జీవికి ప్రాణికి కళ్ళలో ఆ దుమ్ము పడి ఊపిరాడ కుండా నష్టం, కష్టం కలుగుతుందిగదా? అదే ప్రకారంగా కొందరు చేసే ప్రతి పని ఇతరులకు కష్టనష్టాలను గలిగిస్తుంది. కాబట్టి అట్టివారికి దూరంగా యుండాలి.

[illegible] తీగ ప్రాకుతుంది. అది అలా ప్రాకి, ప్రాకి పెరిగి చెట్టు కొమ్మలను వంచేస్తుంది. మానవునిలో దుష్ట స్వభావాలు కూడా అలాగే పెరిగి, పెరిగి మనిషి మనుగడను సర్వనాశనం చేస్తుంది. అంతా మునిగి మిగిలేది ఏమీ లేనప్పుడు అసలు విషయం తెలుసుకునేలోగానే కాటికిపోయే సమయం ఆసన్నమౌతుంది. కాబట్టి కాలయాపన చేయక జనులు తమ మనస్సును శుద్ధ పరచుకొనుటకై యత్నించాలి.

[illegible] చెడు కార్యాలు చేసి, తదుపరి పశ్చాత్తాపముతో

# పరమార్థసూక్తులు



- అంతఃకరణమును నిర్మలమొనర్చునదియే నిజమైన విద్య.
- ఒరులు నీకు ఏమిచేయవలెనని కోరుదువో దానిని ఇతరులకు చేయుము.
- అనేకత్వములో ఏకత్వము కలదు.
- పరోపకారమే పుణ్యము. పరపీడనమే పాపము.
- గర్వము పతనహేతువు. వినయము ఉన్నతికి హేతువు.
- సమదృష్టియే వేదాంతసారము.
- రాజమందిరములోనైనా దీపము లేనిచో వస్తువులు కనుపించవు. జ్ఞాన దీపము లేనిచో సంపన్నునకును శాంతి లభించదు. OO

---

పరితపించి చేసిన తప్పులు దిద్దుకొని సన్మార్గములో పయనించువాడు మేఘాల నుండి వెలికి వచ్చిన చంద్రునిలా ప్రకాశించగలడు. రత్నాకరుడు రకరకాల పాప కార్యాలు చేసినప్పటికి అతడు తన హృదయమును పరిశుద్ధమొనర్చుకొని **"వాల్మీకి"** అను నామధేయముతో నేడు ప్రాతఃస్మరణీయుడై అందరి మనస్సు లలో ఆరాధించబడుచున్నాడుగదా! కాబట్టి మానవుడు తెలియక చేసిన పాప మును గురించి ఆవేదనతో కాలమును వ్యర్థము చేయుటకంటే వివేకముతో, విజ్ఞానముతో పాపమును కడుగుకొను మార్గములనన్వేషించి పుణ్యమార్గము ద్వారా పునీతుడు కావాలి.

ఇట్టి సుగుణములే**మనస్సుకు బలమైన మందులు.** ఇట్టి మందులను మహాత్ములు సేవించి మనందరిని సేవించమని ఆదేశిస్తున్నారు.

కావున మనము వాటిని సేవించి చిత్తశుద్ధిని బడసి ధన్యులమయ్యెదముగాక! OO

# ప్రశ్నోత్తర వేదిక ?



## సందేహా [illegible]

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

(తిరుపతి)

**ప్రశ్న :** *బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు ప్రకృతిసిద్ధంగా ఉండవలసిన లక్షణాలేమిటి? ఏ లక్షణాలుంటే వారిని అలా పిలువవచ్చు?*

**జవాబు :** శ్రోత్రాది జ్ఞానేంద్రియనిగ్రహం, వాక్కు మొ॥ కర్మేంద్రియ నిగ్రహం, శారీరక-వాచిక-మానసిక తపస్సులు, పరిశుభ్రత, ఓర్పు, కపటం లేకపోవడం, జ్ఞాన-విజ్ఞానాలు, దేవునిపైన, పునర్జన్మపైన, వేదాలపైన నమ్మకం ఇవి బ్రాహ్మణునికి స్వభావసిద్ధమైన కర్మలు. శౌర్యం, ప్రకాశం, ధైర్యం, సమర్థత, యుద్ధంలో వెన్ను చూపకుండుట, దానం చేయడం, ప్రభుత్వం ఇవి క్షత్రియుడికి సహజసిద్ధమైన కర్మలు. వ్యవసాయం, గోసంరక్షణ, వ్యాపారం వైశ్యునికి స్వభావసిద్ధమైన కర్మలు. సేవచేయడం శూద్రునికి సహజమైన కర్మ. ఈ కర్మ లక్షణాలు వారిలో ఉంటే వారు అలా పిలవబడడానికి అర్హులు.

**శమో దమః తపఃశౌచం క్షాన్తిరార్జవమేవ చ**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మ స్వభావజమ్॥** (భగవద్గీత 18-42)

(42 నుండి 44 వరకు)

**ప్రశ్న :** *భగవంతుని ఆరాధించడానికి వారు వారు నిర్వహించే వృత్తులు అడ్డుపడతాయా? లేక ఎవరు ఏ పని చేసినా సక్రమంగా ఆ పనిని చేయడంద్వారా భగవదారాధనం చేయవచ్చా?*

**జవాబు :** భగవంతుణ్ణి ఆరాధించడానికి ఎవరి వృత్తీ ఎవరికీ అడ్డుపడదుకదా! అదే

సాధనం కూడా అవుతుంది. అయితే కర్మసంగం లేకుండా తన వృత్తిధర్మాన్ని సక్రమంగా నిర్వహించడం ద్వారానే పరమాత్మను ఆరాధిస్తున్నాననే భావంతో కర్మయోగంతో ఆయనను ఆరాధించాలి. అప్పుడు వాడికి యోగసిద్ధి కలుగుతుంది. ఈ ప్రపంచమంతా ఎవరి నుంచి పుట్టిందో, ఎవరు ఈ సమస్త విశ్వాన్ని వ్యాపించి ఉన్నాడో, అలాంటి పరమాత్మను తను చేస్తున్న ప్రతి పనితోను సేవించి మానవుడు మాధవుడు కావచ్చు. తన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించాలి. ఫలాపేక్షారహితమైన ప్రవృత్తి పరమాత్మ సాయుజ్యానికి దోవ తీస్తుంది.

[illegible]

[illegible] (భగవద్గీత 18-46)

[illegible]

తోచును. కాబట్టి దుఃఖము ఏ మాత్రము సంప్రాప్తించకుండ నుండవలెననిన, ఆత్మస్థితిని బడయవలెను. అదితప్ప గత్యంతరములేదు.

అట్టి ఆత్మస్థితియే యోగము. దుఃఖముయొక్క గంధముకూడ లేని వినిర్మల స్థితియే అది. ప్రపంచములో ధనవియోగము, పుత్రవియోగము మొదలైన ఏ వియోగమైనను క్లేశమును కలుగజేయునుగాని ఈ ఆత్మస్థితిరూప 'దుఃఖసంయోగ వియోగము' మాత్రము బ్రహ్మానందమును గలుగజేయును. అయితే అట్టి స్థితి యెవరికి చేకూరగలదు? పట్టుదలతో గూడిన ధీరచిత్తముగలవానికే చేకూరును. దుర్బలచిత్తునకది లభించదు. ధైర్యసాహసములతో గూడినదియు, 'నేను తప్పక పొందెదను' అను విశ్వాసము గలిగియున్నదియునగు మనస్సే పరమాత్మరూప లక్ష్యమును బొందగలదు.

(1) అభ్యాసకాలమున ఎన్ని ఆటంకములు వచ్చినను జంకకుండునదియు, (2) పట్టుదలతో గూడినదియునగు (అనిర్విణ్ణ, నిశ్చయ) చిత్తమే ఆత్మానుభూతిని బడయగలదు. సాధకుని పడగొట్టుటకై మాయ పలువిధముల యత్నించు చుండును. ఒక్కొక్కప్పుడు సుఖములనిచ్చి, ఒక్కొక్కపుడు దుఃఖములనిచ్చి అది మోసగించు చుండును. అత్తఱి వివేకవంతుడు ఇది 'మాయాపరీక్ష' అని తలంచి భగవంతునిపై, సద్గురువుపై అపరిమిత విశ్వాసముగల్గి, ధైర్యముతో మోక్షమార్గమున నిలద్రొక్కుకొని ముందునకు సాగిపోవలెను.

[illegible]

# శ్రీ సచ్చిదానంద స్వాములవారు (జమ్మికుంట)

మనోనిశ్చలతే సాయుజ్యము. సదుపదేశముల సారమే ఇది. ఎన్నిమార్లు త్రిప్పి త్రిప్పి బోధించినను ఆత్మయే తానని తేలును. దేహభ్రాంతి మాటలతో పోవునట్టిది కాదు. సద్గ్రంథ పఠన, సదుపదేశములు, ఆత్మచింతన నిత్యము జరుగుచుండవలయును. ఏకాగ్రత (చిత్తశుద్ధి) కలిగినకొలది తానే సర్వాంతర్యామియను సత్యము అనుభూతమగును. ఇది పుస్తక జ్ఞానమువల్ల చిక్కేదికాదు. హృదయ గ్రంథమునకు చెందినది. మనసే మాయాజగములు. మనసే సంసార దోషము.

కావున బంధమోక్షములు మనసునకు స్వాధీనమై యుండును. తాళము వేయుటకు, తీయుటకు ఒకే తాళపు చెవి అవసరమున్నట్లు దుఃఖమునకు, సుఖమునకు మనస్సే కారణము. 'Control over the mind means control over the world'. మనసు గెలిచినవాడే మాన్యుడు. విశ్వవిజేత-నిజమునకు మనసు సంకల్పముల కుప్ప. మరేమి లేదు.

ఒక చాకలి రెండు గాడిదలను కట్టివేయుటకై కొయ్యలవద్దకు తోలుకొనిపోయినాడు. ఒకదానిని కట్టివేసి మరొకదానిని త్రాడు లేనందున కట్టివేసినట్లు చేతులతో నటించినాడు ఆ గాడిద కట్టుబడినట్లే భావించి తెల్లవారువరకు కదలకుండా నిలిచినది. తెల్లవారి త్రాడుతో కట్టిన గాడిదను వదలి, త్రాడుతో కట్టబడనట్టి గాడిద దగ్గరకు వచ్చి కట్టు వదలివేసినట్లు నటించినాడు. అప్పుడా గాడిద, తోటి గాడిదలతో కలిసిపోవుట మొదలిడినది. త్రాడుతో కట్టబడకున్నను తన సంకల్పము తనను కట్టివేసినది. అటులే అజ్ఞానమే బంధము-నిజమునకంతా బ్రహ్మమే. బంధమే లేదు. ఇదియే సాయిబాట, సాయి ఉపదేశసారము.

ఇట్టి మనో నిశ్చలతకి ఎన్నో నియమములను పాటించవలసి యుండును. బ్రహ్మోపాసనతో పాటు-ధర్మాచరణ తోడైనప్పుడే శాంతి-లేకున్న మందు త్రాగి పథ్యము చేయనట్లగును, భవరోగము శమించదు. శాంతి చేకూరదు. భగవాన్

ఎప్పుడు "మిమ్ము మీరు తెలిసికొనండి-నేనర్థమౌతాను" అంటారు. మనసు నొచ్చే మాటంటే ఏండ్ల తరబడి జ్ఞాపకముంటుంది. కాని సత్యమైన వేదాంత వాక్కు మనసుపై పడవలసిన రీతిగా ప్రభావము పడుటలేదు. బాబా చెప్పే కొన్ని ఉపదేశములైనా మననము చేయకున్న బాబా భక్తులనుటకాధారమేమి యుండును?

*చిత్తే చలితసంసారో నిశ్చలేమోక్ష ఏవతు! తస్మాత్ చిత్తం*
*స్థిరం కుర్యాత్! ప్రజ్ఞయా పరయాబుధః!*

చిత్తము చలించిన బంధము కలుగును. నిశ్చలమైన మోక్షము చేకూరును అందువలన వివేకముగలవారై చిత్తమును స్థిరమైనదానినిగా చేయవలయును. అయితే మనసు మాటలకు లొంగదు. దానికి సత్యము నెరుకపఱచవలయును. అప్పుడే అది తోక ముడుచుకొనును.

మోక్షము ఆకాశమున లేదు. భూలోకమున లేదు. ఆత్మజ్ఞానముతో కూడిన నిర్మల చిత్తమే మోక్షము. OO

# 'శ'కార బోధ

'శ'కారము జనులకు చక్కటి బోధ చేయుచున్నది. అది ఏమనగా, ఓ జనులారా!-

నేను తల వంచుకొని వినయవిధేయతలు గలిగియున్నచో **'శివ'** అగుదును.

అట్లుకాక తల పైకెత్తుకొని గర్వాహంకారములతో గూడియున్నచో **'శవ'** అగుదును.

నేనేకాదు ఎవరైనను సరియే వారికి అంతే ఫలితము

**('శ' అను అక్షరము తలకట్టు వంచినచో 'శి' అగును. తలకట్టు పైకెత్తినచో 'శ' అగును.)**

*జనులు పెద్దల యెడల,దైవము యెడల శ్రద్ధాభక్తులు గలిగి వినయాది సద్గుణ సమన్వితులై మెలగినచో ఈ జీవితమునందే సాక్షాత్ శివస్వరూపులై వెలయుదురు. గర్విష్ఠులై, అహంకారయుతులై వర్తించినచో శవరూపులై, జడప్రాయులై, జననమరణరూప సంసారమందుపడి దరిగానక తల్లడిల్లుచుందురు. ఈ సత్యమును గుర్తెఱిగి జనులు సదాచారయుతులై మెలగెదరుగాక!*

# సృష్టిలోని వింతలు - విశేషాలు

1. సూర్యునకు అతిసమీపముగ వున్న బుధ గ్రహము సూర్యుని నుండి 3 కోట్ల 63 లక్షల మైళ్ల దూరములో కలదు. ఇది గ్రహములన్నిటిలో చిన్నది. ఇచట వేడి చాల అధికముగ నుండును.
2. ప్రపంచములోకెల్లా చిన్న గుఱ్ఱములను పాబెల్లా అను వ్యక్తి అమెరికాలో సృష్టిచేసెను. వాటి ఎత్తు 2 అడుగులు మాత్రమే.
3. ఈగలలో 60,000 రకములు గలవు. ఈగ చాల తేలికగ వుండును. ఒక ఔన్సుకు 80 వేల ఈగలు తూగును.
4. బొగ్గునుండి నైలాన్ స్టాకింగులు, సువాసన పదార్థములు, ప్లాస్టిక్ ఫోనోగ్రాఫ్ రికార్డులు, కృత్రిమ రబ్బరుటైర్లు, మొదలగు అనేక వందల రసాయనిక పదార్థములను తయారుచేయవచ్చునని పరిశోధకులు తెలుపుచున్నారు.
5. హాలెండు దేశములో ఇసుకను త్రవ్వు ఒక పెద్ద డ్రెడ్జర్ అను యంత్రము నిర్మించబడినది. అది గంటకు 22,400 టన్నుల ఇసుకను నీటివలె తోడగలదు.
6. వి.యన్.సిమ్మన్స్ అను కెనెడా దేశస్థుడు తన శరీరముపై 4,831 పచ్చబొట్లు పొడిపించుకొనెను.
7. టెర్రీ ఫాక్స్ అను కెనడా యువకుడు ఒంటికాలిపై 5,000 కిలోమీటర్లు నడిచి 20 కోట్ల రూపాయలను సేకరించి క్యాన్సర్ వ్యాధి నిర్మూలన కోసం మందుల పరిశోధన నిమిత్తమై తన ప్రభుత్వానికి సమర్పించెను. ○○



# యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి–

పూర్వము మగధ దేశమును ఇంద్రద్యుమ్నుఁడను రాజు పాలించుచుండెను. అతనికి అహల్యయను సుందర స్త్రీ, భార్యగా నుండెను. ఆ నగరమున ఇంద్రుఁడను వ్యభిచార శిరోమణియైన బ్రాహ్మణ కుమారుఁడొకడుండెను. అహల్య ఆతనియం దాసక్తిగలిగి నిరంతర మాతని గూర్చియే చింతించుచు ఖిన్నయై యుండెను. అది గాంచి ఆమె సఖి 'ఆతని నెట్లైన గొనివచ్చెద'నని చెప్పి ఒక రేయి అట్లే తీసికొని వచ్చెను. అప్పటినుండియు వారిరువురును ఒకరినొకరు విడిచి యుండజాలకుండిరి.

రాజు ఆ విషయమునెఱింగి వారిరువురకును అనేక దండనలు విధించెను. ఏనుగులచే త్రొక్కించెను; చన్నీళ్ళయందుంచెను. కొరడా దెబ్బలు కొట్టించెను. కాని వారు ఏ మాత్రము దుఃఖము నొందక ఒకరియొక్క స్మృతిచే మఱియొకరు హర్షపూరితులైయుండిరి. అప్పుడు రాజు వారేల క్లేశము నొందుటలేదని యడుగ ఇంద్రుఁడిట్లు చెప్పెను–

'మాకీ జగత్తంతయు ఒకరి రూపముగ మఱియొకరికి కనుపించుచున్నది. (అనగా నాకు అహల్యామయముగను, ఆమెకు ఇంద్రమయముగను దోచుచున్నది.) కాబట్టి మా దేహములు బాధింపఁబడినను మనస్సులు పరస్పరము ప్రేమమయములై సుఖముగనున్నవి. ఏ దండనలైనను, వరశాపాదులైనను శరీరమును ప్రభావితము చేయగలవే కాని మనంబునుగాదు. మనస్సే ముఖ్యాంకురము. శరీరము నశించినను మనస్సు ఇంకను ననేక శరీరములనుత్పన్నము చేయగలదు.

ఈ దండనలు మీ దృష్టియందు దుఃఖకరములుగ దోచుచున్నవిగాని పర

స్వరానురాగయుక్తులమైన మాకట్లేమియును లేదు' ఇంద్రుని యా వాక్యములను విని రాజు సమీపముననున్న భరత మునితో 'ఈ నీచులకు తగిన శాపమిండు' అని చెప్ప ఆతడు విచారించి 'దుర్బుద్ధులగు మీరిరువురును నశించిపోవుదురుగాక!' యని శపించెను.

అపుడు ఇంద్రుడు ఆ మునితో నిట్లనెను– 'ఈ శాపప్రయోగము ద్వారా మీరు మీ దుశ్చర్య తపస్సును నశింపజేసికొనిరి. ఈ శాపముచే మాకేమియు నష్టములేదు. దేహము నశించినను మనోరూపులమగు మాకేమియు హానిలేదు'. తదుపరి వారిరువురును శాపకారణంబున మృతినొంది భూమిపైబడిరి. అనంతరము వారు తమ అన్యోన్య దృఢప్రేమచే అనేక జన్మలందు స్త్రీ పురుషులై జనించిరి. నేటికిని వారెచటెచట జన్మించుచున్నారో అచటచట స్త్రీ పురుషులుగనే యుదయించుచున్నారు.

ఈ ప్రకారముగ శాపములచే గూడ మనస్సును నిగ్రహించుటకు శక్యము కాదు. కాబట్టి ఐందవుల సృష్టులను నశింపజేయుట మీవంటి మహాత్ములకు యుక్తముకాదు. మీరు ప్రత్యేకముగ మీ చిత్తాకాశమున ఒకటిగాని, రెండుగాని లేక అనేకములుగాని యగు సృష్టుల జేయుఁడు. ఐందవులు మిమ్మేమి చేసిరి? మీరు మీ యాత్మయందు స్వేచ్ఛగ స్థితిగల్గియుండుడు– సూర్యుఁడిట్లు వచింప నేనందుల కంగీకరించి సృష్టినొనర్చి అందా సూర్యుని ప్రథమమనువుగా నుండి సృష్టిక్రమమును తన యిచ్ఛ ప్రకారము జరుపుమని కోర ఆతఁడు సమ్మతించి తన శరీరమును రెండుగా విభజించి, ఒక భాగమును ఐందవ సృష్టియందలి సూర్యునిగా నియమించి మఱియొక భాగముతో మను పదమును బొందెను.

**వసిష్ఠుడు :–** దేవా! పరశాపములు మనస్సు నేల నిగ్రహింపజాలవు?

**బ్రహ్మదేవుడు :–** మనస్సు స్వతంత్రము, అస్వతంత్రముగూడను. పురుష ప్రయత్నముచే దృఢమొనర్చుకొనబడిన చిత్తమును శాపాదులేమియు చేయజాలవు. పురుష ప్రయత్నరహితములైన అదృఢ చిత్తములను శాపాదులు ప్రభావితములుగ చేయగలవు. మనస్సు ఎట్లు తీవ్రముగ భావించునో తన నిశ్చయము ప్రకారము అట్లే ఫలమును బొందును. కాఁబట్టి నీవు పరిచ్ఛిన్న (దృశ్య) దృష్టిని వదలి ఇచ్ఛారహితుడవై ఆత్మయందు నిలకడగలిగి యుండుము

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ బ్రహ్మదేవుఁడు పూర్వము నాకెఱింగించి నది నీకు చెప్పితిని. మాయాశబలిత పరబ్రహ్మము నుండి సమిష్టి మనస్సును, దా

# సుభాషితములు

హస్తాదపి న దాతవ్యం
గృహాదపి న దీయతే
పరోపకారణార్థాయ
వచనేకా దరిద్రతా.

ఇతరులకు ఉపకారమొనర్చు మాటలను ఎందులకు మాట్లాడరాదు? దాని వలన చేతులతో ఏమియు ఈయబడుటలేదు కదా! ఇంటినుండి ఏదియు ఒసంగబడుట లేదుకదా! మఱి మాటలలో దారిద్ర్యమేల?

యన్మనీషి పదామ్భోజ
రజః కణ పవిత్రితమ్
తదేవ భవనం నోచేత్
భకారః తత్ర లుప్యతే.

మహాత్ముల యొక్క పాదపద్మముల ధూళిచే పవిత్రమైనదే భవనమన బడును. అట్లు కానిచో 'భ' కారము వెడలిపోవును. అత్తఱి భవనము వనము (అరణ్యము)గా పరిణమించును. ○○

---

⇨ నుండి వ్యష్టి మనస్సుల జీవులు ఉదయించుచున్నారు ఆయా జీవులు వారి గుణ వైచిత్ర్యము ననుసరించి కొందఱు దీర్ఘకాలమునకు కొందఱు అల్పకాలమునకు మోక్షమును బొందుచున్నారు- మనోరూపమగు ఈ సంసారలత సమ్యగ్జ్ఞానమను గొడ్డలిచే ఛేదింపబడినచో మరల మొలకెత్తదు. (సంసార విముక్తి నొందును.) చిదాకాశ, చిత్తాకాశ, భూతాకాశములను మూఁడాకాశములు గలవు. అందు చిదాకాశము సత్యమైనది. మాయాశబలిత చిదాకాశము నుండి తక్కిన రెండును ఉద్భవించుచున్నవి. అయినను ఈ భేదము అజ్ఞానుల నిమిత్తము చేయబడినదేగాని జ్ఞానులకొక చిదాకాశమే గలదు. ○○

# వినోదము-వికాసము

## బంధమోక్షాల స్వరూపం

'మమ' అనేది బంధాన్ని కలుగజేస్తుంది. 'నమమ' అనేది మోక్షాన్ని ప్రసాదిస్తుంది- అని పెద్దలు చెప్పారు. రెండక్షరములతో కూడిన 'మమ' అనే పదం యొక్క అర్థం 'నాది' యని మూడక్షరాలతో కూడిన 'నమమ' అనే పదం యొక్క అర్థం 'నాది కాదు' యని 'మమ', 'నమమ' అను ఈ రెండు పదాల్లో ఎంతో భావార్థం ఇమిడి యుంది. ప్రపంచంలో ఏ వస్తువూ శాశ్వతం కాదు.

దృశ్య వస్తువులెల్లపుడు పరివర్తన కలిగియుంటాయి. ప్రతి వస్తువు ప్రతి క్షణం మారుతూనే యుంటుంది. స్థిరమై, శాశ్వతమైనట్టి వస్తువు ఈ ప్రపంచంలో లేనే లేదు. కాని కొందరు ఈ విషయాన్ని గూర్చి ఆలోచించటమే లేదు. తన శరీరం, తన బంధువులు, తన ధనం శాశ్వతమని తలంచి ఆయా పదార్థముల కొరకే జీవితాన్ని ధారపోస్తూంటారు. కాని వాటిలో ఏదీ కూడ వెంటరాదు. ఆత్మ ఒక్కటే శాశ్వతం. అదియే తన స్వరూపమై ఎల్లకాలము అలరారుతుంది. వివేకం లేనందువల్ల కొందరు జనులు చంచల పదార్థాలనే పట్టుకొని వ్రేలాడుతూ వాటి సంపాదన యందే అహర్నిశములు పాటుపడుతూంటారు. కాని కొంతకాలానికి అనుభవింపబడే పదార్థము, అనుభవించేవాడు రెండునూ కాలగర్భంలో లీనమై పోతాయి.

ఈ సత్యాన్ని గుర్తించలేక అజ్ఞానులు మమ, మమ (నాది, నాది) అని కలవరిస్తూ దృశ్యపదార్థాలనే శాశ్వతములుగ నమ్ముతూ వాటివెంటే పరుగిడుతూ జీవితాన్ని వృధా చేసుకొంటున్నారు. అలా చేయటం తగదు. నమమ (ఇది నాది కాదు) అని సంస్మరిస్తూ, దృశ్యపదార్థాల యెడల విరాగం కలిగి వివేకవంతుడు శాశ్వతమైన ఆత్మయే తానని నిశ్చయించి అద్దాని అనుభూతిని పొందుటకై తీవ్రతర కృషి చేయాలి. జపధ్యానాదులను సలపాలి. ఆత్మవిచారణ చేయాలి. ఏది తన వస్తువో, ఏది తన వస్తువు కాదో చక్కగ తెలుసుకోవాలి. తనది కాని దృశ్యమందు విరాగం, తనదైన ఆత్మయందు నిలకడ కలిగి యుండాలి.

బంధానికి కారణం దృశ్యపదార్థాల యెడల ఆసక్తియే. మోక్షానికి కారణం దృశ్య వస్తువుల యెడల అనాసక్తియే, ఆత్మ యెడల ఆసక్తియే. నశ్వరమైన దృశ్య పదార్థాల యెడల, విషయభోగాలయెడల ఆసక్తికలిగి వాటిని వెన్నంటుచు అమూల్యమైన మానవజీవితాన్ని కొందరు నాశనం చేసుకొంటున్నారు అట్లా చేయటం సరి కాదు. ఎండమావుల వెంట పరుగిడువాడు అవివేకియే గదా! కాబట్టి ముముక్షువైన వాడు త్వరితముగ సద్గురువును ఆశ్రయించి ఏది నశ్వరమో, ఏది శాశ్వతమో చక్కగ గ్రహించి నశ్వరమగు దృశ్యము యెడల విరక్తిని, శాశ్వతమగు ఆత్మయెడల ఆసక్తిని పెంపొందించుకోవాలి. బంధాన్ని తొలగించుకొని మోక్షమునకు అభిముఖుడై చన వలె. మానవజీవితం అమూల్యమైంది ఏ సమయాన శరీరం రాలిపోవునో ఎవరికీ తెలియదు.

కాబట్టి సమయాన్ని వృధా చేయకుండ వివేక వైరాగ్యాదులు కలిగి ఆత్మ యందు స్థితిని బడసి పరమశాంతిని పొందాలి. ఇదే విజ్ఞుల కర్తవ్యం. ఇదే అందరి యొక్క చరమలక్ష్యం. ఇదియే శాంతికి ఏకైక మార్గం. ఇట్టి భావములనే క్రింది శ్లోకము నిరూపించుచున్నది-

**ద్వ్యక్షరస్తు భవేన్మృత్యు స్త్ర్యక్షరం బ్రహ్మశాశ్వతమ్**
**మమేతి చ భవేన్మృత్యు ర్నమమేతి చ శాశ్వతమ్**

OO

## కలికాల ఏకైక సుగుణము

**కలేర్దోషనిధే రాజ న్నస్తి హ్యేకో మహాన్ గుణః**
**కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబన్ధః పరం వ్రజేత్.**

*కలికాలమున అనేక దోషములున్నప్పటికిని ఒక్క మహత్తర సుగుణము మాత్రము కలదు. అది యేదనగా శ్రీ కృష్ణపరమాత్మయొక్క సంకీర్తన మాత్రముచే మనుజుడు సంసారబంధరహితుడై మోక్షము పొందును.*

*(కాబట్టి భగవన్నామ సంకీర్తనము గావించుచు జీవితమును సార్థకపఱచు కొనుట శ్రేయస్కరము.)*

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు
## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :-

శాశ్వత చందా రు. 300/-లు

1. శ్రీ పి. గోదావరి గారు – మద్రాస్
2. శ్రీ కె. వేంకటేశ్వర్లు గారు – గుంటూరు
3. శ్రీ జి. రాజేశం గారు – సిరిసిల్ల
4. శ్రీ పూరిపెద్ద బాలరాజు గారు – వెల్దండ
5. శ్రీ టి. రామలక్ష్మి గారు – ఎల్లమంచలి
6. శ్రీ వి. రాజు బాలచంద్ర గారు – బొంబాయి
7. శ్రీ పి. రామారావు గారు – చిట్టివలస
8. శ్రీ బొబ్బిలి కొండలరావు గారు – నూజివీడు
9. శ్రీ టి.వి.జి. హనుమాన్‌ప్రసాద్ గారు – గుంటూరు
10. శ్రీ జి. నాగరాజ చెట్టి అండ్ సన్స్ – చిత్తూరు
11. శ్రీ డి. నారాయణరావు అండ్ సన్స్ – విజయవాడ
12. శ్రీ సి.ఎస్. కృష్ణ గారు – కోడుమూరు

OO

If you give up the spirituality within, and go in after materialism only, you can never enjoy permanent peace and happiness.

లోని ఆత్మతత్త్వమును వదలి, దృశ్యము వైపునకు పరుగెత్తినచో, నీకెన్నటికిని పూర్ణసుఖము, శాంతి లభించవు.

---

One is the creator of one's own destiny.

ఎవరి గమ్యమునకు వారే కారణభూతులు.

[illegible]

[illegible]

[illegible]

1) పూజ్య శ్రీ గోవిందరామానుజ పెద్ద జీయంగార్ స్వాములవారు, తిరుపతి — రూ. 55,580/-

2) శ్రీ జి. నారాయణ గారు, Excel, బొంబాయి — 50,000/-

3) శ్రీ చెన్నా వేంకట్రామ్ మెమోరియల్ చారిటబుల్ ట్రస్టు — 25,000/-

4) శ్రీ జి. రామారాయుడు గారు, గుంటూరు — 11,116/-

5) శ్రీ కలిదిండి వేంకట రాయపరాజు గారు,SIRIS, విజయవాడ — 11,116/-

6) శ్రీ ఆర్. రామనాథ్ మంత్రి గారు, హైదరాబాద్ — 11,116/-

7) శ్రీ జి. శివయ్య గారు, సికింద్రాబాద్ — 11,116/-

8) శ్రీ జి. సురేష్ గారు, సికింద్రాబాద్ — 11,116/-

9) శ్రీమతి సరళాదేవి గారు, హైదరాబాద్ — 11,116/-

10) శ్రీ ఎస్. సత్యనారాయణ ప్రసాద్ గారు, హైదరాబాద్ — 11,116/-

11) శ్రీ బి. లలిత గారు, హైదరాబాద్ — 11,116/-

12) శ్రీ బి. గోపాలకృష్ణ అయ్యప్ప గారు, తిరుచానూరు — 5,000/-

13) శ్రీ తటవర్తి రాజాశ్యామల గారు, తెనాలి — 5,116/-

14) శ్రీ జి. లీలావతి నర్సయ్య గారు, బళ్ళారి — 1,101/-

15) శ్రీ హెచ్. ఎన్. భూషన్ గారు, బళ్ళారి — 501/-

16) శ్రీ కె. కేశవరెడ్డి గారు, సాబాద (గద్వాల) — 1,116/-

17) శ్రీ ఎన్. సత్యభామ గారు, కోయంబత్తూరు — 1,000/-

18) శ్రీ ఎస్. సింధుజ గారు, తట్టగుడి — 200/-

19) డా. వి.ఎస్.ఎన్. మూర్తి గారు, జగిత్యాల — 516/-

20) శ్రీ డి. సుబ్బారావు గారు, సికింద్రాబాద్ — 1,116/-

21) శ్రీ జి.ఎస్. సబిత గారు, సికింద్రాబాద్ — 2,000/-

| | | |
|---|---|---|
| 22) | శ్రీ కె. హరనాథ్ గారు, హైదరాబాద్ | 232/- |
| 23) | శ్రీ గీతాసంఘము, కలసపాడు | 316/- |
| 24) | శ్రీ టి. రంగనాథం గారు, విజయవాడ | 1,116/- |
| 25) | శ్రీ సిహెచ్. సీతాదేవి గారు, భీమవరం | 2,000/- |
| 26) | శ్రీ ఎస్. విశ్వనాథం & సన్స్, కాకినాడ | 3,116/- |
| 27) | శ్రీ నిర్గుణానందగిరి గారు, యశ్వంతపురం | 1,116/- |
| 28) | శ్రీ ఎస్. రాజగోపాలన్ గారు, హైదరాబాద్ | - 216/- |
| | శ్రీ కె. లింగయ్య గారు, మహబూబ్‌నగర్ | 1,116/- |
| | శ్రీ డి. రాజేశ్వరమ్మ గారు, తిరుపతి | 1,116/- |
| | శ్రీ ఎమ్. వరదరాజులు గారు, చిత్తూరు | 1,116/- |
| | M/s. ది కోస్టల్ కెమికల్ లిమిటెడ్, నిడదవోలు | 1,116/- |
| | డా. టి. సత్యనారాయణ గారు, విజయవాడ | 500/- |
| 34) | శ్రీ వి. వేంకటమ్మ గారు, బొంబాయి | 500/- |
| 35) | శ్రీ ఎమ్. జగన్నాథంశెట్టి గారు, శ్రీకాళహస్తి | 1,116/- |
| 36) | శ్రీ వై. వీరేశం గారు, కరీంనగర్ | 1,116/- |
| 37) | శ్రీ సిహెచ్. జగన్‌మోహన్‌రావు గారు, హైదరాబాద్ | 2,000/- |
| 38) | M/s. చంద్రశేఖర ఏజెన్సీస్, జగిత్యాల | 333/- |
| 39) | శ్రీ పి.వి. కల్యాణరావు గారు, విశాఖ | 1,116/- |
| 40) | శ్రీ ఎ. రాధాకృష్ణయ్య గారు, కోయంబత్తూరు | 416/- |
| | శ్రీ ఎస్. సత్యనారాయణ శెట్టి గారు, చిత్తూరు | 1,116/- |
| | శ్రీ బైసాని మీనాక్షమ్మ గారు, మదనపల్లి | 1,016/- |
| | శ్రీ డి.ఎస్. కృష్ణమూర్తి గారు, నర్సాపూర్ | 1,116/- |
| | శ్రీ ఎమ్.వి. లక్ష్మయ్య శెట్టి గారు, నర్సాపూర్ | 500/- |
| | శ్రీ హెచ్. సత్యనారాయణ గారు, బళ్లారి | 1,102/- |

...world laughs with you.
...to weep alone.

శ్రీ బి. శ్రవణ్‌కుమార్ గారు హైదరాబాద్ మరియు సికింద్రాబాదు భక్తులనుండి ఈ క్రింది విరాళములను సేకరించి ఆశ్రమమునకు పంపిరి–

| శ్రీయుతులు– | రూ. |
|---|---|
| 46) జి. శంకరమ్మ | 1,100/– |
| 47) పెద్ది వెంకయ్యగుప్త | 1,100/– |
| 48) పి. శ్రీహరిరావు | 1,000/– |
| 49) ఎల్. కమలయ్య | 1,116/– |
| 50) జి.ఎస్. రాధాదాసి | 1,116/– |
| 51) జి. ధనలక్ష్మి | 500/– |
| 52) కె. రామచంద్రదేవ్ | 1,116/– |
| 53) వేదవ్రత 'ఆర్య' | 501/– |
| 54) ఆదినారాయణ | 1,116/– |
| 55) ఎస్.హనుమంతరావు | 1,151/– |
| 56) ఎమ్.బదరీనాథ్&సన్స్ | 2,500/– |
| 57) ఎస్. అనంతమ్మ | 505/– |
| 58) పి. సత్యనారాయణమూర్తి | 5,000/– |
| 59) గౌరా లీలావతమ్మ | 1,116/– |
| 60) డి.ఎ.ఎల్.ఎస్.మూర్తి | 1,116/– |
| 61) సి.వి. నరసింహాచారి | 500/– |
| 62) ఐ. నారాయణరెడ్డి, కలకాల్ | 250/– |
| 63) పి. శ్రీనివాసరావు | 1000/– |
| 64) సి. సుదర్శన శెట్టి | 1,116/– |
| 65) ఎన్. సావిత్రమ్మ | 5,000/– |
| 66) బి. లక్ష్మీబాయి, మామిడిపల్లి | 1,116/– |
| 67) జంధ్యాల రఘు | 1,116/– |
| 68) సుధాకర్, గొల్లపల్లి | 1,116/– |
| 69) శంకరరెడ్డి, | 1,116/– |
| 70) కె. బాలకృష్ణ | 211/– |
| 71) వై. నారాయణాచారి | 216/– |
| 72) పి. రాములు | 1,120/– |
| 73) ఎన్. లింగయ్య | 125/– |
| 74) ఎన్. ప్రసాదరావు | 116/– |
| 75) ఆర్. నందకుమార్ | 516/– |
| 76) జి. చంద్రశేఖర్ | 1,116/– |
| 77) జి. నరసింహారెడ్డి | 5,116/– |
| 78) పి. సుశీలాదేవి | 5,116/– |
| 79) బి. వేంకటలక్ష్మి | 5,116/– |
| 80) ఎన్. యాదగిరి | 1,116/– |
| 81) ఎ. జయలక్ష్మి | 1,116/– |
| 82) ఎమ్. తిరుపతయ్య | 1,116/– |
| 83) కె. వేంకటేశం గార్లు | 5,000/– |

Bhagavad-Gita teaches not renunciation of action, but renunciation in action.

భగవ [illegible] ్యాగమును బోధింపదు, కర్మయందలి ఫలత్యా [illegible] ోధించును.

శ్రీ కె.వి. శేషావతారం గారు కాకినాడ భక్తుల నుండి
ఈ క్రింది విరాళములను సేకరించి ఆశ్రమమునకు పంపిరి—

| శ్రీయుతులు | రూ. | | |
|---|---|---|---|
| 84) బాదం సుబ్రహ్మణ్యం | 1,500/— | 99) M/s. సాగర్ సిమెంట్స్ లిమిటెడ్ | 516/— |
| 85) ఎన్. సత్యనారాయణరెడ్డి | 1,500/— | 100) వి.హెచ్.ఎస్. ప్రసాద్ | 500/— |
| 86) బచ్చు సుబ్రహ్మణ్యం | 1,016/— | 101) పి. సూకారత్నమ్ | 333/— |
| 87) బాదం ప్రభాకరరావు | 1,116/— | 102) పి. రామలింగేశ్వరరావు | 200/— |
| 88) కె. సుబ్బారావు | 1,116/— | 103) ఎస్. శ్రీరామకృష్ణ | 202/— |
| 89) పైడా శేషగిరిరావు | 1,008/— | 104) జి.ఎ. రామారావు | 250/— |
| 90) కె. వరహాలమ్మ | 1,001/— | 105) ఎన్. తాతబ్బాయి | 202/— |
| 91) కె. లక్ష్మీకాంతం | 1,001/— | 106) సి. వీరభద్రరావు | 200/— |
| 92) పి. సుబ్రమణ్యం | 511/— | 107) పి. చలమయ్య | 200/— |
| 93) పి. సీతారామమూర్తి | 500/— | 108) ఎస్. రెడ్డయ్య | 250/— |
| 94) తులసి వీరభద్రరావు | 502/— | 109) గొల్లపూడి సుబ్బారావు | 250/— |
| 95) కె. మురళీకృష్ణ | 501/— | 110) పైడా కృష్ణారావు | 200/— |
| 96) పి. వేంకటేశ్వరరావు | 502/— | 111) జి. వేంకటేశ్వరరావు | 200/— |
| 97) పి. సత్తిరాజు | 502/— | 112) పైడా యోగానంద | 250/— |
| 98) శ్రీ బ్రహ్మానందరావు | 516/— | 113) బి. రామమోహనగుప్త | 473/— |
| | | 114) గొల్లపూడి కృష్ణమూర్తి | 558/— |
| | | 115) జి. వేంకటరమణగార్లు | 501/— |

OO

గద్వాల వాస్తవ్యులు శ్రీ ఎమ్. నారాయణగారు—
శ్రీ శివలింగము మరియు 5 అడుగుల ఎత్తుగల
శ్రీ భక్తకన్నప్ప రాతి విగ్రహమును
సమర్పించిరి. ఆ రెండు విగ్రహములు శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి ఆవరణయందు నెలకొల్పబడును.





1) 25.4.1993వ తేది శ్రీ బసవేశ్వరానందస్వాములవారి అధ్వర్యమున గీతాయజ్ఞ కార్యక్రమము (ఏకాహము) శ్రీకాళహస్తి యందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు విజయవంతముగా జరిగినది.

2) శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు నూతనముగ నెలకొల్పబడిన త్రినేత్ర వైద్యాలయము అను భక్త కన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి యొక్క ప్రారంభోత్సవము 28.4.1993వ తేదీన అత్యంత వైభవోపేతముగ జరిగినది. మరియు 29.4.1993వ తేదీన శ్రీ శుకబ్రహ్మాశ్రమ 43వ వార్షికోత్సవము కూడా జయప్రదముగా జరిగినది. ఈ రెండు కార్యక్రమముల యొక్క వివరములు రాబోవు సంచికలో ప్రకటింపబడగలవు.

3) 57వ గీతామహోత్సవము కడప జిల్లా రాజంపేట పట్టణమునందు 16.5.1993 నుండి 26.5.1993వ తేది వరకు శ్రీ విద్యాప్రకాశానంద గిరిస్వాములవారి అధ్వర్యమున జరుగును.

4) 30.5.93వ తేది చిత్తూరు జిల్లా పుత్తూరు పట్టణ సమీపమున గల గొల్లపల్లి గ్రామమున జరుగు శ్రీ రుక్మిణీ సమేత శ్రీకృష్ణ విగ్రహ ప్రతిష్ఠా కార్యక్రమమునందు శ్రీ స్వాములవారు పాల్గొందురు.



Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**

# పాతంజల యోగసూత్రములు 1-4

## (సంగ్రహము)

## వృత్తి సారూప్యమితరత్ర

***తా/ అంతర్ముఖముకాని సమయములందు మనస్సు బహిర్ముఖ వృత్తులతో కలసియుండును.***

వ్యాఖ్య : క్రిందటి సూత్రమునందు వివేకవైరాగ్యాదులచే దృశ్యమునుండి మరలిన మనస్సు ఆత్మయందు స్థితినొందియుండునని చెప్పబడియున్నది. ఇప్పుడు బహిర్ముఖమైన మనస్సు ఎట్లుండునో చెప్పబడుచున్నది. అది బాహ్యవృత్తులతో కలసి వ్యవహరించుచుండును.

చిత్తము శబ్దస్పర్శాది బాహ్యవిషయములను అభిలషించుచున్నంత వరకు అద్దానికి పూర్ణశాంతి లభించజాలదు. దృశ్యవస్తువుల యొక్క, ధనధాన్యాదులయొక్క సంయోగవియోగములచే అది సుఖదుఃఖములకు లోనగుచు అశాంతియుతముగనే యుండును-

కావున వివేకవంతుడు ఇంద్రియసుఖములయొక్క, దృశ్యానందము యొక్క క్షణికత్వమును, దుఃఖజనకత్వమును గూర్చి మనస్సునకు చక్కగ హితబోధచేసి, వైరాగ్యయుతుడై, అద్దానిని దృశ్యమునుండి మరలించి అంతర్ముఖము గావించవలెను. శ్రోత్రాది ఇంద్రియములను లౌకికవిషయములనుండి మరల్చి దైవకార్యములందు నిమగ్నపరచి, క్రమముగ జితేంద్రియత్వమును, నిర్మలచిత్తమును సంపాదించవలెను. అంతరంగమునందు దృశ్యవృత్తులుగాని, ప్రాపంచిక సంకల్పములుగాని ఏవియు లేకుండగ మహాపరిశుద్ధమొనర్చుకొని మనుజుడు కేవలాత్మయందే, స్వస్వరూపమందే నిలకడను బడసి పరమానందమను భవించవలెను.

ఓం